శ్రీ

# సావిత్రీచరిత్రము

 ( వ ద నై )






గ్రంథకర్త, బాలకవి
మోడిద రామమూర్తిగారు
స్కూలుమాష్టరు, మూగుపురము,

ప్రకటనకర్త;
పి. ఆపెకృష్ణగున్నయ్యగారు
రామచంద్రపురము

మొదటికూర్పు 500 ప్రతులు,

ముద్రితము,
శ్రీరామకృష్ణాప్రింటింగువర్క్సు, శ్రీకాకుళం
(గంజాం జిల్లా)
1935

 (వెల 0-4-6

# మనవి

మిత్రులారా!

పండితప్రియులగు మహారాజశ్రీ గోకవలస రామలింగంగారు శ్రీ సావిత్రీచరిత్రము బదశైలిని రచింపుమని నన్ను ప్రోత్సాహపరుప సమ్మహనీయుని సహాయముచే నేనీగ్రంథము రచింపసాహసించితిని. "గురుజనాళికవని । సురశ్రితార్తులకెల్ల "పట్టవారిమాట ॥ పసిడిమూట" అనెడినుడువుసార్థకమగునట్లుగ మహారాజశ్రీ పట్ట ఆదికృష్ణగున్నయ్యగారు కవితాభిమానులై యీగ్రంథమచ్చువేయించుటకు తగినధనసహాయముచేసి బంధురయశోధురంధరులై పండితుల మన్ననలకు పాత్రులైరి.

గీ॥ గానయమ్మహాత్మునకును । త్వరుణతోడ
ఆయురారోగ్యపుత్రపౌ । త్రాభివృద్ధి
భోగభాగ్యంబుయశమును । పొందునట్లు
జేయుగావుతరఘుకుల । శేఖరుండు

ఇట్లేనాచేరచింపబడిన గ్రంథములను అచ్చువేయించుటకు తగినధనసహాయముచేసి పుణ్యముగట్టుకొందురని నమ్ముచున్నాడను. ఇందలితప్పొప్పులను చదువరులు మన్నింతురుగాత.

ఇట్లు
సుధీజనవిధేయుడు,
గ్రంథకర్త.

# కృతజ్ఞత

సీ॥ ముసిముసినవ్వులఁ + మురియునీ నెమ్మోము
కడకునా కొకసారి + గనఁగనీక
అమృతోపమానంబు + లైనట్టి నీజిలి
బిలి పల్కు లొకసారి + వినఁగనీక
పూలసరంబుల + బోలెడి నీబాహు
ద్వంద్వంబు నొకసారి + బట్టనీక
జాళువా బంగరు + నేలెడి నీశరీ
రమునైన నొకసారి + నిమురనీక

గీ॥ యేగినాడవె దివికిని + యేమిసేతు
నిన్ను విడఁజాల, విడఁజాలి + నిలువఁజాల
నాబహిఃప్రాణమిత్రంబ + నాధనంబ!
హితజనప్రసౌఖ్య + భోగినామేశ్వరాఖ్య!

ఇట్లు,
గ్రంథకర్త.




శ్రీశుని జగదాధీశుని వినుతమ । హేశునిధ్యానించి
విధికిహరునిసారథికిని గుణవా । రధికిసన్నుతించి
హరునకుకల్మష హరునకు పురసం । హరునకుప్రార్థించి
రామునివైరి విరామునిజగదభి । రామునిభజియించి
కమలకు ముఖజిత కమలకుకరధృత । కమలకునుతినల్పి
వాణికికోకిలవాణికినుతగీ । ర్వాణికిమదినిల్పి
దుర్గకునుతశ్రిత వర్గకుతోషిత । భర్గకుగొనియాడి
సీతకు సుగుణోపేతకు కుశలవ । మాతకుమదివేడి
శ్రీవిఘ్నేశుని పాపవినాశుని । ప్రీతితోడగొల్చి
ఆదికవీంద్రుని వ్యాసమునీంద్రుని । అనిశముప్రణమిల్లి
సకలాభ్యాసుని కాళీదాసుని । చాతురిమదినెంచి
బాణమయూరుని భారవిచోరుని । భక్తిఁగోడదలచి
నన్నయతిక్కన భాస్కరకవుల । న్నమ్రత సేవించి
అలశ్రీనాథుని సత్కవినాథుని । ఆత్మయందునెరగి
సోమునికవిజన సోమునిసద్గుణ । స్తోమునిమదిమ్రొక్కి
పోతకవీంద్రుని ప్రౌఢకవీంద్రుని । చేతమందుఁగొలచి

విద్యాసారస భవులకు తిరుపతి । వేంకటేశకవుల
కస్మదీయహృదయాంబుజమందున । అంజలిఘటియించి
'కావ్యతీర్థ'నాఘనతవహించిన । ఘనునిబంకుపల్లి
వంశజుమల్లయ శాస్త్రిలగారిని । పరిస్తుతిగావించి
అచలసువిద్యా ప్రవీణుడన నిర । తాన్నదాతయనగ
రాణకెక్కుమద్గురుని దూసినా । రాయణమూర్తికిని
అస్మదీయ హృదయాంబురుహంబున । అనిశముధ్యానించి
కావిజనులను కుత్సితగుణుల ని । రాకరించిమదిని
తల్లిదండ్రులను బుధజనంబులను । యుల్లమందునెంచి
నేనొకపాత్రము వ్రాయబూనగను । మానసాబ్జమందు
చింతసేయగా నంతలోన నా । స్నేహితుండుఘనుడు
గోకవల్సకుల క్షీరాంభోనిధి । రాకాచంద్రుండు
రామలింగయాఖ్యుండలఘాత్ముడు । రాజిత సద్యశుడు
సంతోషంబున మమ్ముల బాడగని । సమ్మతిగొనియాడి
బాలకవీంద్రా నుతబుధచంద్రా । భవ్యకీర్తిసాంద్ర
శ్రీమద్వల్లవ వంశపయోనిధి । శీతకరుడవీవు
బుధహిత! గంగన యచ్చమాంబకును । పుత్రికుండవీవు
ధరశ్రీవేంకన నరసమాంబకును । దత్తసుతుడవదిర

మి॥ నూగుమీసము రావకమున్నె
'బాల్యలీలలూ బాయకమున్నె
విద్యాభ్యాసము మానకమున్నె

జవ్వనప్రాప్తిని పొందకమున్నే
త్రైనాథవ్రత కల్పకంబును
ప్రాణనాయకీ శతకరత్నము
వారవిలాసిని విలాపగ్రంథము
త్రిపాదకుక్కుట చారిత్రంబును
విటసందర్శన పుస్తకరాజము
అన్యవధూజన రతాభిలాషము

రామయనామా! వ్రాసినాడవు। ప్రౌఢతనము మెరయ
అనగానీదగు బుద్ధిబలంబున । కలవియెగొనియాడ
యెట్టివారలకు నెట్టిది హితమో । యెరుగవలయుజుమ్మ
పామరజనులకు భామామణులకు । పద్యకావ్యమేల
ఆర్తావనుడగు శ్రీరఘురాముని । కంకితంబుగాను
సావిత్రీచరితంబు వ్రాయుమా । నమ్మతిపదశైలి
అగ్గాధకునే సహాయముండెద । నతులితసంప్రీతి
అనియిబ్భంగిని అతనునాతో । నెనరుతోడబలుక
అతనియనుమతి త్రోయజాలకే । ప్రీతివ్రాసినాడ
కావుననిందున తప్పులుగల్గిన । కరుణతోడమీరు
దిద్దుడటంచును మున్నె వేడితిని । ధీరవర్యులారా!
జ్ఞానవిహీనుఁడ బాల్యప్రాయుడ । చంచలాత్మకుండ
ఆంధ్రమరంబుల సుంతయైననే । నరసిచూడలేదు
కావ్యనాటకాలంకారంబుల । గాంచియుండలేదు

ఛందోగ్రంథము లించుకైననే । చదివియుండలేదు
కావుననిందున తప్పులుండునని । నేనుజెప్పనేల
అరయ "ప్రమోదోధీమతామ; పియ । నంగవినగలేదె
తనయుఁడుజేసిన తప్పుక్షమించడె । జనకుఁడనఘులార
శ్రవణానందముగాఁగని కృతిఁ । నవధరింపుఁడయ్య
కవిజనగేయుని మార్కండేయుని । గాంచి ధర్మజుండు
చిరతరభక్తిని యమ్మునికంజలి । జేసియిట్టులనియె
మానికులేంద్రా! ధీనిస్తంద్రా! । మానితగుణసాంద్రా!
కాంతుని పాదాబ్జంబులెగతియని । స్వాంతమందునెంచు
సాధ్వీజన మూర్ధామణిచరితము । సరగఁ జెప్పవయ్య
వీనులవిందుగ వినిమొదననపుడు । మౌనియిట్టులనియె
పాండుతనూజా! క్షితిసురభూజా । భవ్యతేజ! వినుము
రోలంబాంబుజశైలేభాలక । లోచన కుచగమన
యగుసావిత్రీ సతిచరితంబును । యాలకింపుమయ్య
పురములకెల్లవిభూషణ మాచును । వరలె మద్రదేశ
మప్పురివర్ణన సేయఁగనలవియె । యజునికైనగాని
వేదపఠనమునందుఁ మెచ్చురు । విప్రులబ్జభవుని
ఆలమునందునగెల్తురు భార్గవు । నైన రాజసుతులు
ధనదునికైనను అప్పుయిత్తురు । ద్ధరనివైశ్యవరులు
'హరి' యనుయాఖ్యంబేటికి రాముని । కందురంఘ్రిభవులు

మి॥ గగనపుజాడలు గనదగుమేడలు
మరువూదోటలు యప్పురితోటలు

అమృతపుదీవులు అచ్చటిబావులు
అనిలాశ్వంబులు జననశ్వంబులు
శైలావలములు దంతావళములు
అలభేతాళులు గనగభటాళులు
పద్మినిభామలు ఆపురిరామలు
అనిమిష వేశ్యలు అచ్చటివేశ్యలు
భోగవిరాగులు అచ్చటయోగులు
ఆపురినాథుండశ్వపతీయను । నాఖ్యానలరుచుండె
అతనిఖ్యాతింపగవశమొదలంపగ । వసురవరులకైన
పూతచరిత్రుడుశాత్రవజైత్రుడు । బుద్ధికమరగురుడు
ధీరోదారుడు నతమందారుడు । సారసనేత్రుండు
సద్గుణవంతుడు సదమలస్వాంతుడు । సన్నుతార్యుడతడు

మి॥ దానమునందున మేఘసమానుడు
ధైర్యమునందున హేమాద్రీంద్రుడు
గాంభీర్యంబున సాగరతుల్యుడు
సోయగమందున పుష్పశరాస్యుడు
బాహుబలంబున పక్షికులేంద్రుడు
భోగములందున సురలోకేంద్రుడు
శరసంధానము నందుననీయను । జన్మబోలువాడు
నిర్మలచరితా శాంతమునందున । నిన్నుబోలువాడు

సంతతిలేని కతంబుననాతడు । చింతజెందియుండ
సావిత్రీ జపమాచరింపగను । స్వాంతమందుదలచి
ధరణిపుండు పదునెనిమిదియేడులు । తపముజేసెనంత
అతనితపంబునకాసావిత్రియు । నాత్మలోన మెచ్చి
సత్వరంబున ప్రసన్నమైన । శ్యామతలనాధుండు
స్వాంతమునందున సంతసమొందియు । సన్నుతింప దొడగె
దుర్గవునుతశ్రిత వర్గవుశోషిత । భర్గవీవుతలప
సైకతశ్రోణివి కోకిలవాణివి । జలజపాణివీవు
శివునిలతాంగివి నేత్రకురంగివి । చికురభృంగివీవు
భూతసమేతవు సద్గుణవాశ్రవు । భువనమాతవీవు
బాలశశాంకుని మౌళితలంబున । లీలదాల్చినావు
ముగురమ్మలలో మూలపుటమ్మవు । యుగతనూజవీవు
సావిత్రీ భవదీయచరిత్రము । సన్నుతింపవశమె
సురగరుడోరగ కిన్నరభూమిరా । సురులకైనగాని
నీవదదాసుడ నీదుకుమారుడ । నిన్నునమ్మినాడ
అనుచనుతింపగ నాలోకాంబయు । నెనరున యిట్లనియె
వత్సానీకోరుము యిచ్చెదనమ్మతి । వరమునొకటియనగ
నమ్రుండగుచును యారాజేంద్రుడు । విమలభక్తితోడ
ఆసావిత్రికి నమస్కరించియు । నాత్మజుకోరగను
పుత్రికపుట్టు నటంచునంతనా । భువనమాతదెల్పె

జననీనీకృప నస్మదభీష్టము । సఫలముగాదో కా
భూవిబుడిట్లన కారుణ్యామృత । పూరితమతియగుచు
భవదాభీష్టము మున్నె విరించితో । యవనిప జెప్పితిని
నీరజగర్భుడు కన్నియగా నృప । నిశ్చయించినాడు
ఆతనియానతి యమోఘమౌరయ । నైనగానివినుము
కంజదళేక్షణ శతమునునీకును । కలుగుపుత్రశతము
అనుచువచించియు అంతర్ధానము । నయ్యెనుగిరిజంత
మనుజాధీశుడు ధర్మపత్నియగు । మాళవినతితోడ
సంతోషంబున నుండగనావతి । యంతనెలనుదప్పె
తామరసేక్షణ మోముదమ్మిపై । ధవళముగాన్పించె
చెక్కుటద్దములు వెలవెలబారెను । యక్కలకంఠికిని
మెలతుకచన్నులు వలుదలునౌచును । మెఱుగులెక్కనంత
కలదోలేదో యనగానొప్పిడి । కౌనుగానబడియె
గమనమునందున జడభావంబును । గల్గెకలికికొప్పు
బడలికకలిగెను పడతుకమిన్నకు । జడతకలిగెచెలికి
కలకంఠీమణి నవమాసంబులు । గడచియుంటనొక్క
శుభముహూర్తము నందునగాంచెను । సుదతినిపూబోడి
అశుభవార్తను దాసీజనములు । యవనిపతికిదెల్ప
పండితవరులకు కవిజనమణులకు । బాసబోధులకును
అగణితకనకా భరణసుచేలము । లవనిపాలుడొసగె

ఆచెలిసోయగ మెన్నగవశమే । యజునిరాణికైన

మి॥ అళులకుగురులు చెలిముంగురులు
శ్రీసతిసదనము ఆసతివదనము
మీలకునేలున్ తెలికనుడాలుఁ
మారునితూపులు మానినిచూపులు
శ్రీలకువ్రతులు చేడియశ్రుతులు
తేనియబావి చెలికెమ్మోవి
దర్పణరోచులు గండమరీచులు
చంద్రికభాసము చెలిదరహాసము
అమృతపుతేటలు ఆసతిమాటలు
నిర్జితదరము సఖికంధరము
జక్కవగిబ్బలు చక్కనిగుబ్బలు
పూలసరంబులు బాలకరంబులు
తారాసఖములు నారీనఖములు
మదభృంగావళి చెలిరోమావళి

కాంతపదంబులు కోకనదంబులు । కౌనుయెన్నసున్న
అర్ధసుధాంశుని పటలిమునిటలము । అన్న మేనుపొన్న
రమణీముఖలోచనకుచకరపా । దములుగాంచియున్న
అద్దిర యీచెలి పద్మినిభామిని । యనుచుచెప్పవచ్చు
మారునిమారవసాయకమోయన । మానినియలరారి
చేడియమిన్నకు సంతటపెండిలి । చేయుసీమరాగ

వనితామణికిని తగినమగండవ । డవినృపుండుదలప
గానవినోదము తెనుజితపారదు । డైననారదుండు
జనపతిపొంతకు చనుదెంచినబల్ । సంతసంబుగోడ
చక్రివర్తిముని చక్రివర్తికిని । సత్కరించెభక్తి
కుశలప్రశ్నలు అంతటమునికుల । కుంజరుండువేయ
నెచ్చెలులందరు తన్నుగొల్వగా । వచ్చెనుసావిత్రి
ఆరాజేంద్రుని కూతునిగనుగొని । నారదుడిట్లనియె
యీయెలనాగకు తగినమగనికై । నీయావేలయింక
అనుచుమునీంద్రుడు దెల్పగజనపతి । తనయకిట్లులనియె
తల్లీనీదగు రూపసంపదకు । తగినవరునికేను
చూడగనైతిని గావుననీమది । జొచ్చినట్టివిభుని
కోరివరింపుము నియ్యెదనాకును । కుతుకమిందువదన
అనుచువచింపగ కొంచెకసిగ్గున । అతివమొగమువాంచి
కోరికపెంపున సిగ్గుదొలంగగ । కోమలియిట్లనియె
జనకాసాళ్వాధీశుని సుతుడా । సత్యవంతుమదిని
కోరివరించితి గావుననన్నా । కోమలాంగునకును
కన్యాదానము గానొసంగుమా । కన్నతండ్రివేడ్క
రణమునసహాయలకు నోడిపోయితా । రాజ్యభ్రష్టులగుచు
అంధుడైనతన తండ్రితోతల్లితో । నాతడువనినుండె
అయినగాని నేనాతనిగోరితి । నాత్మయందుననుచు

తరుణియభీష్టము తండ్రికిఁ దెల్పఁగ । తండ్రిమునినిగాంచి
నారద ! తనుజితశారద ! వింటే । నాసుతపల్కులను
తమరుమెరుంగని వారలుయెవరీ । ధరణిలోనఁగలరు
మాసావిత్రియు కోరివరించిన । మనుజవిభునిసుతుని
శీలవయోగుణ రూపసంపదలు । చెప్పవయ్యమాకు
అనగానమ్మునిఁ జెప్పఁదొడంగెను । మనుజపతికినిట్లు
రాజా ! తనుజితమనోజ ! రవినిభ । తేజావినుమయ్యా
విమలచరిత్రుని సాళ్వాధీశుని । ద్యుమత్సేనసుతుని
వర్ణింపఁగా ఫణిపతికైనా । వశముగాదువినుమ
సత్యంబెప్పుడు అతడువల్కుటను । సత్యవంతుడంద్రు
జితాశ్వుండను నామాంతరమో । క్షితిపమరియుగలదు
తాలిమినందున ఆరాకొమరుడు । ధరణిబోలువాడు
ఖండనమందున అన్నపవర్యుడు । రెండవరుద్రుండు
కాంతామానన పంకజసూర్యుడు । ఘనతరశౌర్యుండు
బుద్ధికినింద్రాచార్యసమానుడు । పూతచరితుడతడు

మ॥ భానుసమానుడు తేజమునందున
పక్షికులేంద్రుడు సాహసమందున
గంధగజేంద్రుడు గమనమునందున
మేరునగేంద్రుడు ధైర్యమునందున
పంకజనేత్రుడు భవ్యచరిత్రుడు

సద్గుణసాంద్రుడు సజ్జనచంద్రుడు
కోటిమన్మథాకారుండతడీ । బోటికితగువాడు
అయినగాని నామాటనువినుమా । అవనిపాలచంద్రి
పరిణయమైన తదుపరినతఁడొక వత్సరంబుబ్రతుకు
మునివరుడిట్టుల నతనితోపల్కఁగ । తనయనుబోడగాంచి
తల్లివింటివె యిమ్మునివల్కులు । తగదువానికోర
ఒండొకనాథుని గోరరాదెయో । పుండరీకనయన
తండ్రివచించిన పల్కులుతావిని । తనయయిట్టులనియె
భూపమనో వాక్కాయములనగా । మూడుతెరగులందు
అంతఃకరణంబనఘ ప్రధానము । అనగవినగలేదె
మనమునగోరిన నాథునివిడచుట । మగువకుధర్మంబె
త్రికరణశుద్ధిని నాతనిగోరితి । తిరుగదయ్యమనను
అనిసావిత్రియు బల్కఁగనాస్పృపు । డతనివైపుజూడ
చింతయేలనో ధాత్రికాంతా । స్వాంతమందునీకు
యీమెపతివ్రత యీమెవ్రభక్తిని । యీమెప్రాణవిభుడు
లలితచరిత్రా వెయ్యేటికిని । లబ్ధజీవుడగును
యీలలితాంగిని ఆతనికిప్పుడే । యిమ్ము వేట్కఁతోడ
అనుచువచించియు ఆతనిమ్రొక్కులు । అందుకొనుచు వెడలె
మంచిముహూర్తము నెంచియంతనా । మానవనాథుండు
హితమిత్రబాంధవ సతిసుతపౌరో । హితసమేతుడగుచు

వైవాహిక సంబంధమైన । సద్వస్తుకోటితోడ
పుణ్యారణ్య ప్రగోచరుండనై । భూపవర్యుడంత
అంధనృపాలుని అంతకుతాజన । నతడుగౌరవించి
నిర్మలభావా ! ధన్యుడనైతిని । నీవుపచ్చుకతన
ఘనతరచరితా జనసుతభవదా । గమనకారణంబు
కర్ణానందము గాగజెప్పవే । కవిజనస్తవనీయ
అనవుడుఆతని బొడగనియిట్టుల । ననియెనశ్వపతియు
యీకరిగామిని యీలలనామణి । నాకుమారిసుమ్మా
కువలయనాథా యీకాంతామణి । గోరెనీదుసుతుని
గాపునయీకామినికిని నీదగు । గాదివిత్తనయునకును
కైంకర్యంబును జేయనచ్చితిని । శంకయేటికనఘ
అనవుడుయిట్లను అతడుయోన్నృప । ధనములేనియట్టి
విభుడుబెడంగున రతిపతియైనను । వెలదివలచునోకో
ధవుడుతాలిమిని ధారుణిబోలిన । తరుణివలచునోకో
నాథుడుతేజము నందినుబోలిన । నాతివలచునోకో
మగడుబలంబున మృగపతియైనను । మగువవలచునోకో
పతివరవిద్యను సురగురుడైనను । పడతివలచునోకో
సఖియవరించిన తండ్రిదలంపగ । సమ్మతించునోకో
కరిముఖకోంతర మోన్నృపోత్తమా । పరిణయంబుజూడ
పేదవారలకు భాగ్యవంతులును । పిల్లలనిచ్చెదరె

మనమునసంతస మంకురింపగను । మాటలాడిరిట్లు
ఈసర్వజ్ఞునికినిశిరసంటగ । నింతీశశిరేఖ
చాలునట్టి నెరజాణయటంచును । చాటిజెప్పనేల
యీచతురాశ్యసితో బల్కగనా । తీయీశుభ వాణి
చాలునట్టి ప్రౌఢాంగనయనుచును । చాలుజెప్పనేల
ఈరాజునకును సేవజేయునీ । కైరవనిభహాస్త
చాలునట్టి నెరజంతయటంచును । సఖియజెప్పనేల
అనిబహుభంగుల చాతుర్యోక్తులు । అనుచుమోదమున
అశ్వపతీనృప వర్యునియనుమతి ! యగుటచేతచెలులు
సత్యవంతునకు మంగళమంతట । సఖులుపాడిరిట్లు
మంగళమీ రాజేంద్రసూనునకు । మంగళంబుయనుచు
మంగళమీ తరుణీసుమశరునకు । మంగళంబుయనుచు
మంగళమీ ధైర్యాచలనిభునకు ! మంగళంబుయనుచు
మంగళమీ బిసరుహనేత్రునకును । మంగళంబుయనుచు
అనియిబ్భంగినిపాటలుపాడియు । అతనిశిరముపైని
అక్షతలునిచియు ఆశీస్తోత్రప । ముంకురింపనంత
నడుమసియాడగ గబ్బిచనుంగవ । నాట్యమునలువంగ
పెండ్లికుమారునికిని తలయంటెను । వెలదిమిన్నయొకతె
వేణిచలింపగ కోరికలూరగ । మేనుపులకరింప
మజ్జనమార్చెను సత్యవంతునకు । మందగమనయొకతె

తడియార్చెంతట వలువనొసంగెను । తనయొకచెలియొకతె
ముంగల పావాలుంచెను వేడుక । ముద్దుగుమ్మయొకతె
సిగగోజుట్టెను పూవులనంతట । చిగురుబోడియొకతె
కస్తూరీ తిలకంబు ఘటించెను । కలికిమిన్నయొకతె
గంధమలందెను రేనియొడలపై । కంజనయనయొకతె
పురహారంబుల పురమున వేసెను । పొప్పులాడియొకతె
సవరించెను చౌకట్లపోగులను । చంద్రిననయొకతె
రత్నపు టుంగరములదొడగెనుకరి । నాజూకిమనయొకతె
పూలసురటిచేవిసరెవేడ్కప్రా । బోడిమిన్నయొకతె
నిలువుటద్దమును నవ్విభునెంగట । నిల్చెచెలియొకతె
ఈరీతిని యాసత్యవంతునకు । వింతులుగై సేయ
ముందుపురోహితునకు వగ్నిమిల్లియా । బుధులకెల్లమ్రొక్క
మామగారికిని పెద్దలకెల్లను । మనసారింభక్తి
పెండ్లివేదికోపరియంమునగూ । ర్చుండిపెండ్లికొడుకు
అంతటఆసావిత్రిసతికిశిర । సంటెనొక్కయువతె
భూపతితనయకు మజ్జనమార్చెను । ముగుదమిన్నయొకతె
పురుకుచకునుతడి యొత్తెనొక చెలి । పురతరసంప్రీతి
పట్టుపుట్టమును గట్టనిచ్చెనొక । పంకజాయతాక్షి
తొయ్యలియొక్కతె హైరినేవికను ! తొడగనిచ్చెచెలికి
పొలతుకబలితపు గబ్బిమిటారపు । గులుకుచన్నువగయు

రంభాస్తంభంబుల తిరస్కరించును । కమనీయోదళనవదళ
అంబుజతారకములనేలకన్నును । అతివముఖముసఖము
ఝషనజావిలికిని నిరసించును । నకియకంఠస్వరంబు
మునులభ్రమింపఁగని యాసావిత్రిక । వినుతిసేసిమరియు
అతిశోభిల్లని సోయగంబునకు । నబ్బురంబుజెంది
నత్యావంతునకు నన్నుతిఁజేసిరి । సన్మునులనీతి
శంఖునిమూడవ నేత్రముచేతను । దద్దినట్టిమారుఁడు
తనజనకుండౌ హరికృపచేతను । తనువుదాల్చిభువి ని
అవతరించిన యామదనుండో । అరయనీతండు
కాకయుండినట్టి యుట్టివోడంగును । గలిగనితనికెల్ల
నీలమేఘముల నిరసనసేయగ । చాలునితనికొప్పు
రాకాచంద్రుని నెగ్గాడునుయీ । రాజవరునిముఖము
వెలిగొండమ్ముల నెగిజేయించును । పినికవన్నదోయి
యిందిరతనయుని సింహాసనమా । యీతనివక్షంబు
అలమృగరాజున కునుయెదిరించును । దలవవీసినదువు
సావిత్రిముఖ పంకజంబునకు । సారసహితుఁడితఁడు
కల్మషరహితుండు బుధజనగేయుడు । ఘనుఁడీన్నపతులుడు
దేవబ్రాహ్మణ గురుబుధసజ్జన । సేవారతుఁడితఁడు
ఎగుబుజంబులను గల్గినవాఁడే । యెమ్మికాఁడుధీర
ఘనధైర్యంబున । కాకనకాచల । మునతనేలువాఁడు

రమణీమానస వికసితకైరవ । రాకాచంద్రుండు
సూరివిధేయుడు సద్గుణధుర్యుడు । శూరవర్యుడితడు
పావనచరితుడు నిరతమునూవ్రతి । ధీమణుడితండు
సత్యవంతుడను నామంబితనికి । సార్థకంబుగాదె
ఈతనిగొనియాడగ నాభాషా ! పతికిని ఫణిపతికి
నై నవశంబును గాదనిపలుకగ । నబ్బురమానొక్క-
అనిమునులందరు । అనతిపతులకు । వినుతిసేయనంత
కోవిదులగు ధరణీసురవరులుత । దేవలగ్నమునుచు
మంత్రోచ్చారణ నేసిరిపస్ఫుట । మానసజ్జులగుచు
సతిపతికరముల కునుకంకణముల । గట్టిమంగళాష్ట
కంబును చదివిరి అంతటభూమీ కాంతుడశ్వపతియు
జనకుడుసీతను శ్రీరఘురామున । కునువొసంగుభంగి
సత్యవంతునకు కన్యనొసంగెను । సంతోషంబుగను
కామినిమణికిని మంగళసూత్రము । గట్టెను చెలువుండు
చెలువునితలపై తలబ్రాలనుబో । సెనులతాంగివీరి
చేడియతలపై తలబ్రాలనుబో । సెనువృపుడంగటను
ఈచందంబున కల్యాణోచిత । కృత్యమంతిజరగ
అశ్వపతీవర పాలకుండంతట ! నంతరంగమందు
అత్మజయగు సావిత్రిలతాంగిని । నప్పగింతసేయ
నిశ్చయించియును తనయల్లునికర । నీరజాతమందు

ఆసావిత్రి మృదుహస్తంబును । చేపియిట్టులనియె
పదములవాఁంతా సద్గుణవంతా । సత్యవంతవినుమ
నీరజనేత్రిని నెటులేలెదవో । నీదేభారంబు
సాధముందుపది సారుఃఃపడచిన । చావకాల్లపాకు-
దినకరరశ్మికి నయినగాముయీ । శివకోణేమిన్న
తలపసుధాంశుని రశ్మికైనను । కాకబాలదయ్యా
పూలనుగోసిన యచ్చటయీచలి । కేలుకందునయ్యా
పొరుగిండ్లకు కానచ్చైనడచన । గోదిలలితాంగి
అనృతభాషణ మూవంతైనను । అడదుతునాతి
భారతాది సద్గ్రంధరాజముల । పఠనసేయుగాని
పరసప్రబంధము లకలనైనను । చదునకుయీతేను
గురుజనంబులకు నెదురుజెప్పదీ । కుసుమకోమలాంగి
బీదసాధులకు గాహానుమయీ । బింబఫలపమోష్ఠి
కవికరంబునకు నెలవుదలపనీ । కంజపత్రనేత్రి
బంధుజనాళికి నాదరించునీ । సింధురవిభగమన
అనియీవిధమున ఆసావిత్రికి । నప్పగించివిభుడు
తనపురంబునకు బోవదలంచియు । తనయుమబాడగాంచి
సావిత్రి ! సరసీరుహపత్రివి । శౌలచారునేత్రి
అత్తమామలకు ప్రాణనాధునకు । ననువమునద్భక్తి
సేవసేయుమూ తల్లినీకును । సేకురునద్యశము

అత్తగారెయిక తల్లియటంచును । అత్మదలపుమమ్మ
నా భావంబున మామగారికిని । నారితలపుమమ్మ
పతిపాదారిబుజ సేవారతవై । వరలుమిందువదన
పతిపాదాంబుజ సేవారతవై । వరలుచుందువేని
వ్రతములు యేటికి క్రతువులు యేటికి । అతివమిన్న నీకు
అనవలనంటిగ గానితనయనీ । కునుస్ఫురించనట్టి
నీతులుగలవే భూతలమందున । నీరజనిభవదనా
రాకులంబునకు ఖ్యాతినితీసుక । రావలెనుమలేమ
ధనముగడింపగ వచ్చునుగానీ । తల్లివినుమమ్మ
తలవసద్యశోధనము గడింపగ । తరమ్ముగాదుసుమ్మ
శ్రీ తిపుండేక్రియ తనయకుబుద్ధులు । సెప్పిబుజ్జగించి
హితశ్రిత భాంధవ జనతతిపారో । హితులతోడనంత
తనపురంబునకు ధారుణినాధుడు । చనియెనంతనిచట
కంజదళేక్షణ కటియుశరీరము । గబ్బిగుబ్బచనులు
గంధభాగములు కంఠంబునుజం । ఘలునుకురులునాభి
తామ్రచక్రంబుగ స్వర్ణంబుగఘన । శైలరాజములగ
హీరఫలకములగాజయకంబుగ । వీరకాహాళులుగ
ఘనలక్ష్మిగమరి అరయనుహానిధి । గాయలరారంగా
రాజ్యంబేలిన పోల్కమదనసా । మ్రాజ్యమేలుచుండె
అతులితపార్థివి సత్యవంతుడుసు । హర్షచిత్తుడగుచు

ఆసావిత్రి ప్రవర్తనంబును । ఆలవిమెఁగొనియాడ
ప్రాతఃకాలము నందునస్నానము । పణతివేగనలిపి
నుదుటనుకుంకమ । బొట్టుపెట్టుకొని । పిదపవంటసేసి
అత్తమామలకు ప్రాణనాథునకు । ఆశ్రితజనులకును
అతులితమృదు లాన్నంబును బెట్టియు । అతివపిదపతినును
ఆసావిత్రి ప్రవర్తనంబును । అత్తమామలకును
తననాథుండగు సత్యవంతునకు । గవిసిగూర్చెనుగుల
బుధజనసమ్మత మునకామినికా । వురమునేయుచుండి
సావిత్రిలలనామణికదియు । జీవవిభునియొక్క
ఆయుఃప్రమాణ మారసియంతట । ఆకటనాల్గుదినము
లున్నవటంచును మెరిగియుశివునకు । నమ్మతించెనిట్లు
జయజయరిపు నాశంకరశంకర । జయజయసర్వేశ
జయజయభక్త వశీకరశ్రీకర । జయజయభూతేశ
జయజయముల్లోకేశ్వరయీశ్వర । జయజయదేవేశ
జయజయశైల సుతావరధీవర । జయజయసోమేశ
పార్వతినాయక శ్రీహరిసాయక । భక్తలోకవరద
భుజగవిభూషణ కవిజనపోషణ । రజతశైలవాస
వరదయాకరా సన్మునిసేవిత । భానుశపదకమలా
కమలజాదిసుర లోకపాలనా । కలుషనాశవరద
సురమునిజననుత పదయుగరిపుహర । శుభదనుజనశరణ

మనసిజమదహర శ్రితబుధసరసిజ । దినకరశశిఫణిభరణ
దీనురాలనగా గావగరారా । దిక్కునీవేసుమ్మీ
దీనురాలవగు నాదగుకోరిక । దీర్చనవుడుగాదె
దీనావనయను బిరుదమునీకును । దీనపాలకలుగు
ననియీవిధమున శంభునిగొల్చియు । అంబుజాయతాక్షి
వ్రతమునరించెను మూడుదినంబులు । నతులితసంప్రీతి
వెలదుకదీక్షకు ద్యుమత్సేనుడెడ । విస్మయంబుసెంది
ఆసావిత్రిని గనుగొనియిట్టుల । ననియెమామవేగ
యిట్టివ్రతంబును యేలజేసెదవు । యిందువదనయనగ
మామయ్యావిను నేనొకదీక్షను । మావనంబునందు
నెంచీవ్రతమును సేయుచునుంటిని । అంచితసద్భక్తి
మామగారికిని సమాధానమా । మగువయిటులజెప్ప
తారకంబులును దారెనుకుక్కుట । ధ్వనులుయంతమీరె
అసితాబ్జంబుల పోడిమిమీరెను । అంబుజములుగేరె
ఏపగుచల్లని గాడుపుకేరెను । దీపతతులునారె
అండజంబులునూకూయదొడంగెను । అంతదెల్లవారె
ప్రాతఃకాలపుకృత్యములన్నియు । ప్రీతివేగసల్పి
జననీజనకుల యానతిగైకొని । సత్యవంతుడంత
వనమునుకును వెడలంగదలంచగ । వనజనేత్రివిభుని
కనుగొనియిట్టుల ననియెమనోహర । వనముజూతునేను

వచ్చెదనాదగుకోరికదీర్పవె । వసుమతీంద్రచంద్ర
అదియునుగాక మనఃప్రియులినుమా అరనిమిషంబైనా
నిలువగజాలను నినువిడచియు । నీపదంబులాన
గావున నాదగుకోరికదీర్పుము । కరుణతోడవేగ
నీకాంతామణికోరికదీర్పగ । నీకుచెల్లదాకో-
అనియిబ్భంగిని సతిశైలంబుల । శైసకరగునటుల
తనపతితోడను మృదుభాషణముల । తరుణిదెల్పగాను
అవనీపాలుని హృదయముగరగగ । అనియెనుసతికిట్లు
కంజదళేక్షణ ప్రమదావనమును । గాదువిపులభూమి
కలకంఠీమణి వీణారవమును । గాదుఘూకరవము
బింబోష్ఠీమణులచ్చటనుండరు । మృగచయంబుగాని
యిట్టివనంబునకునునరుదెంచిన । యేమిసుఖమునీకు
అయిననుగానీనీయభిలాషము । అబలమాన్పనేల
నాతలిదండ్రులశెలవును గైకొని । నాతివేగరమ్మ
అనితననాథునకనతీయగను । అంతటమొదమొంది
అసావిత్రియు అత్తమామలకు । భాసురమతిమ్రొక్కి
సమిత్కుశఫలములను తెచ్చుటకై । చనునటవిభుసుతుడు
మానవనాధుని వెంటనుబోవగ । మనసుపుట్టెనాకు
గావుననాకును శెలవొసంగుడు । కరుణతోడమీరు
అనివచియింపగ అత్తయుమామయు । అనతిచ్చిరెలమి.

ఆసావిత్రియు సత్యవంతుండును । అంతవిపినమునకు
సరసాలాపము లాడుకొనుచువా । కరిగిరిసంప్రీతి
ఆవనవింతలు జెప్పసాగెనా । యలఘుమనతికిట్లు
తోయ్యలికొమ్మలు పల్లవసంఘము । తోడ నునయ్యాట
సలుపుచునుండుట సకియరొగంటివె । సంతసంబుతోడ
గురుకుచగంటివె లికుచఫలంబుల । కులుకులాడినీదు
సిబ్బెపుగుబ్బల తోసరిపోలక । చెట్లనందుడాగె
అలినీలాలక కంటివెఅళులను । అతివమిన్ననీదు
కురులనుపోలక మధువునుగ్రోలుచు । తిరుగుచుండెవనిలో
ఏణీలోచన । కనుమీనములను । యిందువదననీదు
చెళుకులచూపుల కునుసరిపోలక । బెదరిచూచుచుండె
హరినిభమధ్యా కంటివెహరికిని । అంబుజాక్షినీదు
అనుమధ్యంబున కునుసరిపోలక । అకటగుహానుజొచ్చె
కరినిభగమనా ! కంటివెకరికిని । కల్కిమిన్ననీదు
గమనంబున కునుఓడిపోయిదా । గ్రక్కునచనుచుండె
బింబఫలాధరి నీకెమ్మోవియు । బింబఫలమటంచు
ఆశతోవచ్చిన శుకమునుగంటివె । యోశుకనిభవాణి
వనజనిభాస్యా గనువనజంబుల । వన్నెలాడినీదు
వదనాంభోరుహ మునకునుపోలక । పంకమందుజిక్కె
ప్రౌఢతనంబున పన్నగహారికరి । బంధనములతోడ

పతులును సతులును రతులను దేలెడి । జాడలు గనుబలు
పదములపొంతను సద్గుణవంతుడు । సత్యవంతుడంత
చేడియమిన్న కు నావనవింతలు । చెప్పిచెట్టునెక్కి
మధురఫలంబులు గోయుచునంతట । మమతగ్రస్తుడగుచు
దిగువను తాబడి మగుపనజేయుచు । తీవబోణినాకు
పలుకులుతడబడె నడకె శరీరము । బాధహెచ్చుబోచెప్పి
ధరపై పాదము లానకయుంచెను । తనుజలంబుతగ్గి
యింతినాకును భయమును గలిగెను । యేమిలోచదాయె
వనరుహాలోచన నేజీవించెద । ననెడినమ్మాటంబు
చాలదటంచును చేడియతొడపై । సత్యవంతుడంత
శిరమును బెట్టియు విశ్రమించియును । శివునిమదినిగొల్చి
జీవితేశ్వరియని ప్రాణంబును । త్రితిపుడంతవిడచె
నాధానాధా నాథాయనిబిం । బాధరోష్ఠియపుడు
అవనీజాతము కరికరకంపిత ।మగుచు నేలబడిన
కై వడిభామిని మూర్ఛనుసెందియు ! కడకు తెల్విజెంది
యిష్టదేవతా ప్రార్థనమాబిం । బోష్టియిట్లుపలికె
హరిహరహిరణ్య గర్భులారనా । వరునిపాకరయ్యా
పంచప్రభూతము లారవేగనా । పతినిబ్రోవరయ్యా
బిపతహామిత్ర మధాంశులారనా ।విభునినేలరయ్యా
నానాహాని Kనంబులారనా । నాథుగావరయ్యా

సురగరుడోరగ సిద్ధసాధ్యభూ సురవరేణ్యులార
మీరలైననా ప్రాణనాథునకు । రారవేగగావ
అక్కటక్కటా యెవ్వరైననునా ! కష్టపడరెయిపుడు
యిట్టియనాథను బ్రోచియుపుణ్యము । గట్టుకొనరెచెపుడి
ననుమీరుమారిగా దలపోసియు । నన్నుగావరయ్యా
నాకంఠంబును గోసినాడుగా । నాదుప్రాణవిభుని
అనితరప్రాణేశుని తిలకించియు । వనితయిట్టులనియె
ఏమిసేతునో ప్రాణేశా యిక । నేమిగతియునాకు
చెప్పితివా కొ చెప్పవెసమధిక ! కలసుగుణజాల
నీప్రాణేశ్వరి తోడనుదెలుపగ । నీకుసంశయంబె
నాదుమనోహరి నీవుయటంచును । నాకుబల్కినావు
ఎట్టిరహస్యము లైననునీతో । నింతిచెప్పకున్న
నామనసొప్ప దటంచుననాతో । ప్రేమతోడనీవు
ఏకాంతంబున చెప్పగలేదే । యేలబల్కవకట
నాళీకాస్త్రుని బారికినోర్వగ । జాలకననుగాంచి
కలికిమారువూ ములికిచిలుకల । కొలికియంచుబిల్చి
బాలనజేసియు చికురజాలమును । లీలతోడదువ్వి
ఫాలతలంబున ముద్దుబెట్టియు ! పాయనిసంప్రీతి
కరకంజంబుల కౌగలించియును । కాము[illegible]ల
రతిసమరతులను నన్నేలుదువు । అతుల[illegible]

యిప్పుడు కౌగిట చేర్పవదేటికి । నేటికతిచలము
నీజననీజనకులపై నుండిన । నీమదిప్రేమకి
నిశ్చయంబుగను పులికొదరించిన । నీదుభావాలకి
నీకామినియగు నాపైజూపిన । నీదునింపుకి
అతనురాజ్యరమ వనితనుబిల్చెన । హా!నీవడుగోకి
యెట్లులమరతును పాపదైవమును । యేమనినిందింతు
తల్లిదండ్రులను బాధగలేనిది । కాళజాలవనుచు
పలికిరువాతో పల్కితివక్కట । ప్రాణనాథయింత
జననీజనకుల జూతగరమ్మా! చాలగప్రొద్దాయె
నీవునేడురాకుండి నయిప్పుడు । నేనుమెటులపోదు
నీతలిదండ్రులు నీప్రాణేశుఁడు । నీరజాయతాక్షి
యేడియటంచును నాతోబల్కిన । యేమనిచెప్పుదును
గావుననాప్రియ ననునీతోడను । కలుపుకొనుమటందు
అతిశోకంబున కుందుచుమండగ । నంతటకాలుండు

మి॥ నీలనీరదాకారముతోడను
ప్రజ్వలచలద్రక్తాక్షులతోడను
ఘోరనిశాతప్ర దంష్ట్రతోడను
స్వర్ణవర్ణపరిధానముతోడను
భయదకాల పాశంబులతోడను

అప్పుడదేతెంచి ముంగలగనబడ । సతియాయమునిగాంచి

కాంతునిశిరమును దిగువనుజేర్చియు । కాంతజమునికెరిగి
కారుణ్యాకర మీరలుయెవరో । కనుగొనలేనైతి
అయినగానినా మగనిబ్రోచివు । న్యాయమునుగట్టుకొనవె
అనిప్రార్థించిన కాంతనుబొడగని । అర్కజుడిట్లనియె
సాధ్వీమణిరో అవధరింపుమా । శవనుడందునన్ను
నీపాతివ్రత మహిమనుమ్ముల । నెలతగంటివీవు
కానిమృగేక్షణ అన్యజనాళికి । గానబడనునేను
జలరుహలోచన నీపతికాలము । సలుపవచ్చినాడ
అన్నులమిన్నా నీవిభుండిప్పు । ణ్యాత్ముడైనకతన
యితరజనంబుల కునునేబంపక । యింతివచ్చినాడ
యింతిరొనీవును చింతించినఫల । మేమిగలదుసెవుము
తామరసేక్షణ గావుననీదగు । ధవునివిడచిపొమ్ము
అనియీవిధమున శమనుడుబల్కియు । యవనివిభునిసుతుని
తనువునుప్రాదే శపరితాత్ముడయి । తెనరుజీవువెడల
దీసియుచెచ్చర దినకరసుతుడతి । దీర్ఘపాశములను
బద్ధునిజేసియు అంటిటవెడలగ । పణతిమిన్నవిభుని
దేహమునొకయెడ గుప్తముగానిడి । మోహనాంగియమును
పోవుచున్నమా రంబుననేగెను । పొలతియుఖేదమున
ఆసావిత్రిని తాబొడగాంచియు । అనియెనుయముడిట్లు
వలదువలదు పూర్ణేందువదనరా । వలదుకుందరదన

నీకగమ్యమిక మీఁది తెఱవురో । నీరజాక్షియనగ
ఆసావిత్రియు యమునికనుంగొని । అక్కటగనివృత్తి
పతులెచ్చోటకు జనినఅచ్చటకు । సతులుజనగవలదె
నీదుప్రసాదము చేతనుబొందియు । నాదుప్రాణవిభుని
పదపద్మంబుల భక్తి కలంబున । పంకజాక్ష తనయ
మానితగుణగణ నాగరుగంగగ । రానిచోటుగలదె
గనబహుమార్గము లందుధర్మమా । ర్గంబుముఖ్యమనఘ
ఆర్యవర్య ధర్మంబునకాధా । రంబుయార్యసుజన
అట్టివారి సందర్శనమబ్బిన । అకలావృథయగాని
గాననీదు సందర్శనకతమున । గల్గునాకుశుభము
పామరజనముల భంగినిమెట్లుశు । భంబులబడయకను
ప్రారకయుండెద ననితాబల్కిన । ఆరవిసూనుండు
ఆమెప్రగల్భవచనములకునునతి । నబ్బురంబుజెంది
మృగసిభేక్షణా ! నీవాగ్భంగికి । మెచ్చితిమదిలోన
చెలిగోరుమువర మిచ్చెదనీవిభు । జీవితంబువక్క
అనవృత్తయా సావిత్రియుప్రాంజలి । యైతాసిట్లనియె
మామానుయ్యకు కన్నులేవురో । మానితగుణసాంద్ర
గావుననాతని కీవుసుప్రీతమున । కన్నునొసగుమయ్య
అనవుసుయట్టుల నయ్యేడుననియా । యముడుబోవుచుండ
అతనివెంబడి వెడలుచుండియును । అతివయిట్టులనియె

నెఱపక వాజ్ఞాన సత్క్రియలను నే । రికిరినెగ్గు జేయ
బూనరు యంతియెగాక శ్రీతాళుల । బోత్రితురార్యవరులు
నీవు మెఱుంగని ధర్మంబెయ్యది । నీరజాప్త తనయ
ధర్మరాజనీకియ్యది ధర్మము । లన్విగొంతుగోయ
ఆరయంగనమ వర్తియనగ ప్ర । ఖ్యాతిగాంచినావు
భార్యాభర్తల బాపుటనీకిది । భావ్యమెసెపుమయ్యా

మి॥ అనుచువచింపగ నర్కతనూజుడు
ఆసావిత్రిస్ తాబొడగాంచియు
అంభోజేక్షణ యేలపయాసను॥
జెందెదవమ్మా డెందమునందున
కొందలమొందకు నాధునిజీవము
కోరకవేరే వరమునుగోరుము॥
చంద్రనిభానన తడయకనిచ్చెద
అనిజముడెలదిని ఆమెతోబల్కగ
ఆనారీమణి మానసమందున
పాయనియట్టిము దంబును సెందియు

అర్కతనూజా వైరులచేతను । అపహృతమైనట్టి
రాజ్యమొసంగుము మామామయ్యకు । పూజ్యనీయుండనగ
ఆశమనుండును అట్లుగునాయని । యరుగగసావిత్రి
ధర్మరాజనీ కును దెలియనిన । ధర్మములనుగలదె

అయినగానినా విన్నపమిప్పుడు । అలకింపుమయ్యా
పతిచే త్యజించిన సతికినిసద్గతి । భానుజగలదా ప్రా-
ప్రాణనాయకుడు । లేనివధూమణి । వైభవమదియేల
శుకములేని పంజరమరయంగను । సుదతికినాథుండు
లేనిసౌగసుయని నాతివచింపగ । అనలినాప్తజుడు
వెలదిరో నీపతి జీవముడక్కను । నేరెవ్వరముగోరు
మంబుజలోచన నిచ్చెదననగా । అబలయిట్టులనియె
పుత్రరహితుడౌ మాతండ్రికినయ । పుత్రశతమునిమ్మ
అట్లుగాగాయని అతండరుగగ । అనివవచ్చుకతన
ఆశ్రమమునకును యిట్లనిపల్కెను । అంబుజముఖతోడ
రామామణిరో నీవిటనుండియు । రాగశలవులేదు
వెనువెనవచ్చెద వాయిదెగనుమా । నరకమింపువదనా
యింతీయీనరకంబుననుందురు । యిట్టిపాపజనులు
మి॥ కూటసాక్షులును కుటిలాధ్యక్షులు
సుజనశిక్షకులు మాంసభక్షకులు
బుధజనద్వేషులు బాంధవద్వేషులు
గురుజనద్రోహులు సజ్జనద్రోహులు
ప్రాణఘాతకులు మిత్రఘాతకులు
శ్రితజనాంతకులు స్త్రీజనాంతకులు
విషప్రయోగులు కపటప్రయోగులు

అనృతాలాపులు కుగుణకలాపులు
పరసతిగమనులు పతిచ్యుతిరమణులు
చోరజనంబులు కుజనగణంబులు
యిట్టిపాపులకు హింసచేసెదరు । యింతిరో నాయొక్క
దూతలుగావున అబలకో చాలును । నాతోరానేలా
అనియాశమునుండీట్లులపల్కగ । నాసతియిట్లనియె
యేమమాటలను యాడినయంతినె । యెట్టివారలైన
ఆర్యజనాళికి చుట్టములందురు । ఆర్యవర్యవినుము
ఆర్యజనీకును నాకులభించెను । అధికభాషణంబు
అకతమునసీకును నేజాట్టము । నన్నుజెప్పనేల
హితులమనోరథమును దీర్పంగను । హితులకుదగదోక్క

మి॥ అనిసావిత్రియు యమునితో బల్కగ
సూర్యతనూజుడు సుదతికినిట్లనె
కన్నియనీకుప్రసన్నుడనైతిని
గావుననీయభిలాషవరంబును
కోరుమిచ్చెద కొంకకబాలా

అనివచియింపగ నాసావిత్రియు । అనియెజమునికిట్లు
చింతరకరుణా నీప్రాణేశుని । జీవితంబుదక్క
ముదితరో గోరుమటంచునునాతో । మున్నుపల్కుచుండు
వారయనప్పటియట్లవచింపక । అతివనీయభీష్ట

మెద్దిరయొగోరుమటంచునుపల్కితి । వద్దిర సంప్రీతి
పతిరహితంబును దుస్సహమారయ । ఘానఃబవినుమయ్యా
గావుననాహృదయేశుని జీవితు । గానొసర్చుమయ్యా
అనివచియింపగ నాసావిత్రికి । యముడునుయిట్లనియె
కొనుమిదెనీ ప్రాణేశుని జీవము । కోమలాంగియితడు
చతుశ్శతాబ్దములను జీవించును । నరగపుత్రశతము
గాంచునటంచును అతడువెడలను । కల్కిమిన్నయంత
అజితాత్రిశ్వని పొంతకుదాజన । అతడుజీవలబ్ధు
డై తనవనితను జూడగనియిట్టుల । ననియెనకటబాల
కతులడవును నిందింపెతిమమ్ముల । కాంతబలియుడాకడు

మి॥ ఎక్కవజవమున బట్టిబలంబెడ
లగనుదిగిచెను నాతండవ్వడా
నాతీసెవుమా అదికలగాదే
సత్యంబయ్యది అయినట్లున్నది
నాకునదంతయు వెరవునుగల్గెను
నావుడుమానిని అతనితోడను
జరిగినదంతయు సవిస్తరంబుగ
దెల్పియునాసతి ప్రాణనాయకుని
వీపునుతట్టియు జీవితేశ్వరా
బడలికపోయే వరకునునిచ్చట

విశ్రమింతుమా యనిచెలిపలుకగ
ఆసావిత్రితిని తాబాడగాంచియు
తనప్రాణేశుడు యిట్లనిపల్కె..ను । తరుణీమణిశోడ
ననునిమిషంబును గాంచకయుండిన । మనమునచింతించు
తల్లిదండ్రులను జూడగలేనిది । తాళజాలగలనె
నాతలనొప్పియు పోయెనుగావున । నమువగలనుజూమ్మ
అనివచియింపగ నాసావిత్రియు । హర్షచిత్తయగుచు
తనప్రాణేశుని కౌగిటజేర్చియు । తనదుయాశ్రమునకు
మందగమనమున పోయిరియచ్చట । మనుజవిభునితండ్రి
యగుసాళ్వేశుని కన్నులుగన్పడ । యమునికరుణవలన
తనకునుకన్నులు కనబడునంతనె । తనమనంబునందు
మానితగుణులగు కొడుకునుకోడలు । రానికారణమున
మి॥ డెందమునందున కొందలమందియు
హాపరమేశ్వర । హాజగదీశ్వర ।
హాకరుణాకర ! హాసుగుణాకర !
అనివిలపించియు కన్నులులేనిమ
నుష్యుని కైవడి గానకనేడ్చెను
వనరుహనేత్రిస మేతుండగుచును
తదుపరిమానిజ నంబులబొడగని
నాకొడుకునకును నాకోడలకును

అడవికిబంపితి మతిహీనతచే
పంపినందులకు వచ్చెనుకీడును
వారిలయొక్క తె రంగును జెప్పరె
అనిశోకింపగ నానమయంబున
సావిత్రీసహి తుండునగుచునా । సత్యవంతుచెంత
జననీజనకుల కునుతాప్రయొక్కగ । జనకుడిట్లులనియె
యింతవరకును నీసతితోడను । యేమికారణమ్మున
విపినమునందున నుంటివనగసా । విత్రిదెల్పెవనిలో
జరిగినదంతయు సవిస్తరంబుగ । సరగనతనితోడ
దెల్పినవెంటనె సంతసమొందియు । తెరవునుతిలకించి
తల్లీనీదగుమ హిమచేతనూ । తనయుడుజీవించె
పూర్వజన్మమున నెంతటితపమును । పొలతికొజేసితివొ
అరయనీవును కోడలవైతివి । అతివమిన్నమాకు
వనితానీసుగు ణంబులపొగడగ । వశమేదలపోయ
సురగరుడోరగ సిద్ధసాధ్యకిం । పురుషవరులకైన
అనిగొనియాడియు మునులకుమ్రొక్కియు । జనిరియాశ్రమునకు
మి॥ తమపరిచయాసా ళ్వేశునిమంత్రులు
కావలిబంటులు పౌరజనంబులు
జనపతిపొంతకు వచ్చిముదంబున
జోతలుసేసియు మానవనాథా !

అవధరింపుమా మీపగతుండును
ఆత్మభృత్యుచే ధనముకలంబున
బాంధవసహితుండై మృతిజెందెను
గావునమునపురి కేలికవై మము
గావుమటంచును వేడుకొనంగను

సంతోషంబున సుతునుశాను గ | జంబుపైనియెక్కి
తరుణితోగోడలితో తనపురికిని | అరగిసుతునికపుడు
పట్టముగట్టెను ఆ నరపాలుడు | పౌరసమ్మతిమున
సత్యవంతుడు యేలుచుండెజన | సమ్మతముగ భువిని
జననీజనకులు మానసమందున | సంతసంబుజెంద
తననాథునకును అత్తమామలకు | తలిదండ్రులకును
తనపాతివ్రత మహాత్మ్యంబున | తనివిబొందజేయు
యీసావిత్రి చరితం బెవ్వరు | భాసుర మతితోడ
చదివిన వ్రాసిన ఆలకించినను | సర్వశోభనములు
వారల కబ్బునటంచును దెల్పెను | పాండు సుతునితోడ
ఆమార్కండేయుడు బుధగేయుడు | అతులిత మోదమున
స్తవనీయంబగు శ్రీ సావిత్రీ | చరితను పదశైలి
వ్రాసితి మామకహితుతునను మతిచే | వకళ పీందుగిలార
మాయిలవేల్పగు శ్రీరఘురాముని | కాయతసద్భ
నీకృతి నిచ్చితి గావుననిందున | యెట్టితప్పులున్న

క్షమించిదిద్దుము కోపగించకుము । సత్కవీంద్రులార
ఆరయమోడిద రామమూర్తియన్ । నాఖ్యనలరువాడ
సిరికినతముకాపుగమా బూరిజ । పురనివాసకుండ
క్షితినిదూసినారాయణమూర్తికి । శిష్యుడ బుధహితుడ
జానకిరామా వైరివిరామా । సకలసుగుణధామ!
మంగళమిదియే గొనురఘురామా । మానిహృదయకామా!

## గద్య.

ఇది శ్రీగంగవాత్మజ వేంకన దత్తతనూజను
ధీజనవిధేయ రామయనామధేయ ప్ర
ణీతంబైన శ్రీసావిత్రీచరిత్రంబు
సంపూర్ణము.



శ్రీ

# త్రినాథ వ్రతకల్పము.

గద్య పద్యాన్వితము.

గ్రంథకర్త,

యమ్. రామమూర్తిగారు

వలయువారు-

దున్న సింహాద్రి

శ్రీ ఆత్మారామ్ బుక్కుడిపో.

టెక్కలి.